"చణ్డాల ప్లవ మాతఙ్గ దివాకీర్తి జనఙ్గమాః"-"అర్థః పీడాధమున్యా ర్జోక్షః,"-"పక్కణః శబరాలయః" - అమ.

"తూపరాణపు టమ్ము తూ మొప్పరము జల। దారి యనంగను దనరును జల। నిర్గమము తన్ను ఖంబున నీటితోడ। వచ్చు తృణములఁ గోరకనిపలక సేరు। లాఁపరా యం మ జనులు పల్కఁగను తెలియు." - ఆం. భా.

క. అద్దమరే యద్దాసరి। యద్దండ బిడాలగాహి తాలయ కృకవా
కూద్దండ రవము విని చను। ప్రొద్దాయె నటంచుఁ బాడఁ బోవుచు ద్రోవన్. 11

అద్దాసరి, అద్దమరే(యి) = అర్ధరాత్రియందు, అద్దండన్ = ఆ సమీపమున, బిడా...మున్ - బిడాల = పిల్లి చేత - గాహిత = చొరఁబడిన - ఆలయ = ఇంటిలోని - కృకవాకు - కోళ్ల యొక్క - ఉద్దండ = బిగ్గరయైన - రవము = కూఁతను, విని, చను ప్రొద్దు ఆయెనటంచున్ = (స్వామి సేవకు) తరలు వేళ అయినదని (తలంచుకొని), పాడన్ = నాస్తుతులు పాడుటకై, పోవుచున్, త్రోవ = మార్గమందు (అవతలికి అన్వయము).

తా.—ఒకనాఁడు ఆదాసరి అర్ధరాత్రమున ఆచెంత నొకయింట పిల్లి చొరఁగా, దానికి బెదరి కోళ్లు కూయఁగా, ఆ కూఁతలు వేగుప్రొద్దుకోడికూఁత యని తలఁచినవాఁడై వెంటనే లేచి నన్నుం బాడుటకై వచ్చుచు దారిలో.—

"నడిరాతిరి యన। నడిరేయి యనఁగఁ గాం। నా మాంనార రా। ద్దన సరిప్రొద్దన నద్దమరెయి। యన నిశీథాఖ్య దగు" ఆం. భా.

ఆ. మరులుఁ దీఁగ మెట్టి యిరు లన్న నో యని
యొడు తమిస్రఁ గాడుపడి పొలంబు
లెల్లఁ దిరిగి తూర్పు దెల్ల నౌతఱి నొక్క
శూన్యగహనవాటిఁ జొచ్చి చనుచు. 12

మరులుఁ దీఁగన్ = మరులుమాతంగి తీఁగను (దీనిని ద్రొక్కినవారు దారితప్పుదురు), మెట్టి = త్రొక్కి, ఇరులు = ఓ చీకటీ, అన్నన్ = అని పిలిచిన, ఓఅనియెడి త మిస్రన్ = ఏమి అని బదులు పలుకునట్టి చీకటి రాత్రియందు, కాడుపడి = దారితప్పి దిగ్భ్రమగొని, పొలంబులు = చోట్లు...శూన్యగహనవాటిన్ = నిర్మానుష్యపుటడవి ప్రదేశమును,..."చీకటి యిరులునాఁ జెలు వొందు"-ఆం. భా.

'ఇరులన్న నో యనియెడు' - అతిశయోక్తి - గాఢాంధకారముగల యని భా. "తమిస్రా తామసీ రాత్రిః" అమ. ఇరులు-సంబుద్ధి - పలుకుము అనుమధ్యమ పురుషము ఊహ్యము. మరులుఁ దీఁగ-చూ. పట్టిక. "ఓ యన నేమి నా నొప్పుఁ గి మర్థమై"-ఆం. భా.

సీ. ఇడిసిన యిడుపుల యొడలఁ బొర్లు నుత్త
రేను గసెంద కోరింద పొదలఁ
గెడసిన గరిసెల క్రింద లాఁగలఁ గ్రుస్సి
యదనఁ గాఁపురముండు నాఖుతతుల

సగము దుమ్మునఁ బూడి చిగిరింత వామూయఁ
బెరిఁగిన నూతిపాఁతర బొటియలఁ
చీమలు ప్రాలీడ్వఁ జివికిన వెలుఁగుప
ట్టునఁ బండి యెండి క్రుంగిన గునుకులఁ
తే. పెంటదొగ్గళ్ళలోఁ గడు పంటి శ్మశ్రు
చలనములఁ గ్రుక్కు జీర్ణోతువులఁ బొలంపు
దుండుగల మళ్ల యూరులఁ దూలి రాడు
చిక్కునేతాల పాడఱు సీమఁ జనుచు. 13

(1) ఇడి...లఁ - ఇడిసిన = కూలిపోయిన - ఇదుపుల = ద్వారపార్శ్వములయొక్క - ఎడలఁ = ప్రదేశములయందు, పొత్రే...లఁ - పొత్రేను = పొట్టిరేఁగు - ఉత్తరేను = అపామార్గము - కసింద = కాసమర్దము - కోరింద = జపాక - అనువాని - పొదలఁ = పొదరులచేతను; (2) కెడసిన గరిసెల క్రిందఁ = పడిపోయిన గాదెలకు అడుగున, ఆఁకటఁ = క్షుధచేత, క్రుస్సి = కృశించి, అదవకాఁపు రము = అస్థిరనివాసముగా, ఉండు - ఆఖు తతులఁ = పందికొక్కుల గుంపులచేతను; (3) సగము = (నూతిగోతులయు పాఁతగోతులయు) అర్ధభాగము, దుమ్మునఁ = ధూళిచేత, పూడి = నిండి, చిగిరింత, వామూయఁ = ఆ గోతుల నోళ్లకు) మూఁతగా, పెరిఁగిన నూతి పాతర బొటియలఁ = బలిసిన బావులయు కట్లఖాతములయు పల్లములచేతను, (4) చీమలు = పిపీలికలు, ప్రాలు = గింజలను, ఈడ్వఁ = లాగికొనిపోఁగా, చివికిన వెలుగు పట్టులఁ = సారము చచ్చిన కంచెల తావులయందు, పండి = (గునుకధాన్యము) పక్వమై. ఎండి = శుష్కించి, క్రుంగిన గునుకులఁ = అణఁగిపోయిన గునుకు సస్యముచేతను;

పెంట దొగ్గళ్ళలోఁ = పెంటలలోని దొగ్గలిచెట్లయందు, కడుపు అంటి = (తిండిలేమిచే ఆఁకటి) కడుపు వెన్నునకు అంటుకొనిపోయి, శ్మశ్రుచలనములఁ = మీసాల కదలికను - క్రుక్కు - జీర్ణ ఓతువులఁ = అణఁచుకొనుచున్న ముసలి పిల్లులచేతను, పొలంపుదుండుగలఁ = చేలయందు బలియు కలుపు మొలకలచేతను, మళ్లయూరులఁ = మడులయందలి బొరుగంటలచేతను, రాడు చిక్కు ఏతాలఁ = నిట్రాడు మిగిలియున్న యేతాలచేతను. పాడఱు సీమఁ = పాడుపడిన ప్రదేశమందు. చనుచుఁ = పోవుచు.

తా.—ద్వారపార్శ్వములు కూలిపోఁగా, అచ్చోట, పొట్టిరేఁగులు - కసివెందలు - కోరిందలు - పొదలుగా బలిసినవి; గాదెలు పడిపోఁగా వాని క్రింద బొక్కలలో ఆఁకట నకనకంబడుచు పందికొక్కులు తత్కాలనివాసము కాఁపురముండినవి; బావులును పాఁతగోతులును దుమ్ముపడి సగము పూడిపోఁగా వాని నోళ్లకు మూఁతగా చిగిరింత పెరిఁగియుండినది; చీమలు గునుకువరి గింజల నీడ్చుకొనిపోవు దారిలో సారము చచ్చిన కంచెలతావున ఆ గునుకుగింజలు పడి మొలచి వెన్నులు పెరిఁగి పండి ఎండి రాలి అణఁగి పోయినవి; పెంటలమీఁద పెరిఁగిన దొగ్గలిచెట్లలో ముసలిపిల్లులు ఆఁకట సొగిసి కడుపు వెన్నుకొనిపోయి మీసాలనుగూడ కదపక పడియుండినవి; పొలములన్న తావుల గాదము పెరిఁగినది; మళ్లలో బొరుసుబ్బులు మొండుకొన్నవి; ఏతాలు నాశమై, అవి యుండిన తావులందు వాని రాడులుమాత్రము మిగిలి బిగిసిపోయి యుండెనవి; అట్టి పాడు ప్రదేశమున ఆ దాసరి పోవుచుండెను.—స్వభావోక్తి.

సీ. ఎలనీటి బొండలంబులు వోలె మెదడెల్ల
జుట్టి వైచిన డొల్లు పుఱ్ఱెగములు,
నెఱచి గీఱిన జీర లేర్పడఁ దుదముట్టఁ
జీఁకిన నులిపచ్చి కీకసములు,
దొనదొన యను నీఁగెతుట్టెల రూపేఱు
పడక క్రంపలను బ్రేలెడు గరుసులు
దూళ్ల మక్కెక్కి మంగళ్లతిప్పలు రేఁగు
నడుపున గాలి నాడెడు నెఱకలుఁ,
తే. దునిసిన నరాంగకములఁ బొత్తులను గమిచి
పోక యొండొంటితోఁ బోరి పీఁకులాడు
శ్వాపదంబులుఁ, బదహతి స్రస్సి వలుచు
వరుగు దఱచగు ముఱుత్రోవ నరిగి యెదుట. 17

ఎలనీటి బొండలంబులువోలెన్ = లేఁతవి యుండినవై ఒలువకయే తలగొట్టిన లేఁత టెంకాయల వలె, మెదడు ఎల్లన్ = మస్తిష్క మంతయు. జుట్టి=పీల్చి, వైచినన్ = పాఱవైవఁగా, డొల్లు పుఱ్ఱెగములున్ = దొరలుచున్న పునుకపిండులును, (2) ఎఱచి=మాంసమును, గీఱిన జీరలు=గీఁకికొనఁగా కలిగిన గీఱలు, ఏర్పడన్ = స్ఫుటపడునట్లు, తుదముట్టన్ = నిశ్శేషముగా, చీఁకి...లు - చీఁకిన = పండ్లతోఁ గీఁకి చప్పరించిన - నులిపచ్చి కీకసములున్ = కొంచెము పచ్చిగల యెముకలును, (3) దొన దొన యను ఈఁగ తుట్టెలన్ = దొనదొన యనుశబ్దముతో ముసరుకొనునట్టి యీఁగల క్రిక్కిఱిసిన గుంపుల చేత, రూపు ఏఱుపడక=స్వరూపము కానరాకుండ, క్రంపలను=గుండ్ల కొమ్మల మీఁద. ప్రేలెడు గరుసులన్ = వ్రేలాడుచున్న పచ్చితోళ్లును, (4) దూళ్లన్ = దుమ్ములచేతను. మక్కెక్కి = మాలిన్యము కప్పి, మంగళ్లతిప్పలు = మంగలవాండ్రు గొరిగిన వెండ్రుకతిప్పలు. రేఁగు నడుపునన్ = ఎగసి వ్యాపించు రీతిగా, గాలిన్ = గాలిలో, ఆడెడు నెఱకలున్ = నెగయుచున్న వెండ్రుకలును,

దునిసిన నర అంగకములన్ = తుండగపడియున్న మానవావయవములను, పొత్తులన్ = రెండు మూఁడు శ్వాపదములు కలసి తినుటగా, కమిచి = నోటఁగఱచుకొని, పోకన్ = పోవుటలో, ఒండొంటితోన్ = ఒక శ్వాపదము ఇంకొక శ్వాపదముతో, పోరి=కొట్లాడి, పీఁకు...తిన్ - పీఁకులాడు = పెనఁగులాడెడు - శ్వాపదంబులున్ = ఘాతుకజంతువులును - పదహతిన్ = వానికాళ్ల త్రొక్కుడుచేత, స్రస్సి = నలిగి, వలుచు = వాసనరేఁగుచున్న - వరుగున్ = ఎండమాంసపుఁదునకలును (లేక వాసన కొట్టుచున్నదైన త్రోవకు విశేషణముగా నొకపక్షము) - వరుగు = ఒకతెగ గడ్డలు - (జాత్యేకవచనము), దఱచగు ముఱు త్రోవన్ = దట్టముగానున్న దుర్గంధపు మార్గమున, అరిగి=పోయి, ఎదుటన్ (అవలి కన్వయము.)

తా.— ఆ దాసరి ఆ దుర్గంధపుదారిని ఆ మట్టిని దరిసెను. దానినిండ ఎలనీటిని త్రాగి మీఁగడ గుంజు లేఁతకొబ్బెరను గీఁకిగీఁకి తిని పాఱవైచిన టెంకాయబొండ్లములవలె లోని మెదడంతయు జుట్టి పాఱవైచిన పునుకలు మెండుగాఁబడియుండినవి.—[ఉపమాలంకారము.] అట్లే పండ్లతో

పీనికి చౌరవయు జిత్తును ఎక్కువకావున ఇవి ముందువచ్చును. ఆ బొమ్మరాకాసి గ్రుచ్చి పెట్టు కొనియున్న మాంసఖండములతోడి తోరెములను గ్రద్దలు తన్నుకొనిపోవుచో, కొమ్మకుఁ దగులుకొని తోరెము రాక, కొమ్మ, మీఁదికి క్రిందికి ఊఁగులాడఁగా, లేక, అతఁడు చిన్నకొమ్మతో ఆ గ్రద్దలను వ్రేటువేయఁగా, అవి ఆ తోరెమును వదలుకొని ఎగిరి తొలంగుచు గోడ పెట్టుచుండెనని భా.— 'అడ్డంబు' - వచ్చుచున్న దాసరిని పరికించుచున్న రాకాసికి ముఱుఁగుగా. 'కరాహతి' - కరము రాకాసిది. 'గొండి' - చేతిదెబ్బ తగిలినచోటు. 'గాంచి' - దెబ్బలో బయలుగా నున్నచోట నేమో చేయుచు, రాకాసి ఆ బయలిని ముఱుఁగుచేసను, ఇంతలో అటనుండి తొలఁగి మఱియొక బయల నేమో చేయుచుండెను. 'నడుఁదుగామి' - మాయచేత రూపమును కొన్నంగాని. ఒకవేళ నడుఁదే అందుమేని, నరునియునిక్కికి అది సమయము గాదు, పైగా పాలగాలిచే రాకాసి పలుకవ తోఁచుచున్నది; కష్టమయినను అట నుండఁదగదు; తన దారికి నుంగొని పోవుటకు తన టటకు కదు మారిము. "ఎవ్వఁడో యొక్కఁడున్నవాఁడు" అనుపాఠమున, షద్పాదముల తుది ద్వితీయులను తృతీయార్థకములనుగాఁ గొనవలయును. అనువ్యాదుల చేత "అనుదుణ" - ఊహింనుమ అని యన్వయము. తృతీయార్థమందు ద్వితీయా ప్రయోగము జడవాచకములకు విహితము (సూ. బాల. కారక. ౨౨.) అయినను, "కొన్నియెడల నజడంబు తృతీయార్థములకును బహుళత్వంబున ద్వితీయ చూపబడు" - ప్రౌ. వ్యా. కారక. ౧౮. సూ. "అతని దోర్దర్పసరణి నోలాడుచున్న ఘనతరస్తనచక్రవాకముల నలరు, నంబనసురేంద్రు కూఁతు రింపారఁ గనియె." హరి. ఉ. ౭. ఆ.-అని యుండుట వలన "శునులక" "కపులక" అను రెంటను, ద్వితీయ సాధువుగా ప్రౌఢవ్యాకరణమునందు గన్పట్టెడి; కాని-భాషాస్వాభావ్య విరుద్ధంబగుటచే ఈ మతమును, దాననే ఈ పాఠమును, అప్రశస్తములు. 'బామిక' - 'బామికి నెరి కెమ్ముక యానెగడు నస్థ్యభిధానము' - ఆం. భా. 'శుని'- స్త్రీలింగము-శ్వానము పుంలింగము, పలలము-"పిశితం తరసం మాంసం పలలం క్రవ్య మామిషమ్"- అమ. 'తోరణము' - "తోరణో౽స్త్రీ బహిర్ద్వారమ్" - అమ. ఇది బహిర్ద్వారవాచకము. వాడుకలో దానికింగట్టెడు మామిడాకు లోనగువానిం గ్రుచ్చిన (లేక కట్టిన) త్రాటికి పేరు ఆ సాదృశ్యమున చిన్న చిన్న వస్తువులను వ్రేలఁ గ్రుచ్చిన త్రాటికి పేరయినది. ఘుంతి - పా. హతి (= దెబ్బ);- "కఙ్క్ష్యోద్ధి ద్వజే ఖ్యాతో లోహపృష్ఠకృతాన్తయోః-" మేదిని. "వగచెదురపిల్ల వందురఁ బల్లటిల్లెఁ । బక్కనన నంగలార్చ్చ నాఁ బక్చుచుండు" - ఆం. భా. "పఁడగు నాకస్కంబు డబ్బాటనంగ" - ఆం. భా. "ప్రబలు ముఱుగ్రోవ నాఁగ దుర్గంధపదవి" - ఆం. భా.

సీ. మ్రాఁకుమ్రొక్కల రెంటాన నిడ్డఁ జాలక నెత్రు
రంజిల్లు పెనుపొట్టు ముంజివానిఁ,
బల్లచీమల వక్రభల్లాతకియుఁ బోలె
నెల్లడవున్వెంత నొప్పు కళ్లవాని,
వజ్రాంగ్ల హాస్యను స్ఫాఫఁ బొయిగు గడ్డ
మును పంక్తికలుఁ బోల్చు మొగమువానిఁ
గడుఁదప్పద నిడు తుబ్బిగలిఁ బోఁగ లోఁ బొందు
రత మింపు కపిలకూర్చంబువాని,

తే. నెఱకుఁదెఱువరిఁ గన శాఖ లెక్కఁ జాఱు
ప్రేవుజందెంబుఁ గసరి పైఁ బెట్టువాని,
వ్రేలు డగుబొజ్జ గల బూర గాలివానిఁ,
జెంబుతలవాని నవటు కచంబువాని. 19

౧౯, ౨౦ పద్యములకు ఒకటే యన్వయము. ఇట్లు ఏకాన్వయముగల రెండుపద్యములను కులక మందురు. (1) మృతమర్త్యున్ = చచ్చిననరుని (నరశవమును), రెంటానన్ = గోఁచిగా, ఇడ్డన్ - పెట్టుకొనఁగా, చాలక=(పొడవు) చాలనందున, నెత్రు=నెత్తురు, రం...నిన్ - రంజిల్లు=ఎఱ్ఱ నగు చున్న - పెను=పెద్ద - బొడ్డు = నూతిగోడవంటి (పొక్కిటితోడి) - ముంగివానిన్ = మొలత్రాడు గలవాఁడును;

(2) పల్ల...యుఁన్ పోలెన్ - పల్లచీమల=పాటలవర్ణముగల పిపీలికలుగల-వక్రభల్లాతకియుఁ బోలెన్=వంపుగింజల జీడిచెట్టువలె (ముంతమామిడిచెట్టు=మొక్క జీడిచెట్టువలె), ఎఱ్ఱుప్పటిన్ = రక్తవర్ణమయిన కప్పడముచేత, ఒప్పు - కఱ్ఱివానిన్=నల్లనివాఁడును;

(3) వ్యత్య...భన్ - వ్యత్యస్త=తలక్రిందుసేయఁబడిన- హస్తిమస్త=ఏనుఁగుతలయొక్క- ఆభన్ = తీరుతో, పాయ అగుగడ్డమున్ = రెండు పిండములుగా నేర్పడిన చిబుకమును, దంష్ట్రి కలున్=కోఱలును, పొల్చుమొగమువానిన్;

(4) కడుఁదుర్గ నిడు తుట్టె గతిన్ = కడుఁదురఁగలయొక్క నిడుద గుమివలె, చొంగ లోన్, పాండురతన్=శ్వేతపీతవర్ణము, మించన్ =అతిశయించునట్లుగా, కపిలకూర్చంబువానిన్ = గోరోచనవర్ణపు శ్మశ్రువులు (అనఁగా గడ్డమును మీసములును) కలవాఁడును;

ఎఱకున్=తిండికై, తెరువరిన్ కనన్ = మార్గస్థుఁడు ఎవఁడేని అటువైపు వచ్చుచున్నాఁ డేమో కనుంగొనుటకు, శాఖలు=కొమ్మలు, ఎక్కన్, జాఱు ప్రేవు జందెంబున్ = భ్రంశమొందిన ప్రేవుల జన్నిదమును, కసరి=కోపించి, పైన్=బుజముమీఁద, పెట్టువానిన్ = మరల నుంచుకొను చున్నవాఁడును, వ్రేలుడు=వ్రేలుచున్నట్టిది, అగు-బొజ్జ=పొట్ట, కల - బూర గాలివానిన్ =శ్లీపదము కలవాఁడును, చెంబుతలవానిన్ = చెంబునాకారపు శిరముకలవాఁడును, అవటు కచంబువానిన్ = పెడతలయందు తలవెండ్రుకలుగలవాఁడును,

తే. కండకన్నులవాని, నాఁకటను బండ
తిట్ల బేతాళికల సారెఁ దిట్టువాని,
నగగరిమవాని, నన్వర్థ నాముఁ గుంభ
జాను వనునొక్కద్విజనిశాచరునిఁ గనియె. 20

కండ కన్నుల వానిన్ = కండలు పెరిఁగిన నేత్రములు గలవాఁడును, ఆఁకటన్=ఆకఁటి చేత, బేతాళికలన్=పిశాచికలను సారెన్ = మాటిమాటికి, బండబూతులన్ = కాఱుఁదిట్లచేత, తిట్టువానిన్=శపించుచున్నవాఁడును, నగ గరిమ వానిన్=కొండంత బరువుగల వాఁడును, అన్వర్థ నామున్ = సార్థక నామధేయుఁడును (అయిన), కుంభజానువు =కుండమోఁకాలివాఁడు - అను - ఒక్క - ద్విజనిశాచరునిన్=బాపనరక్కసుని (బ్రహ్మరాక్షసు ననుట), కనియెన్.

తా.—ఆ దాసరికి ఆ చెట్టుమీఁద నొక బ్రహ్మరాక్షసుఁ డగపడెను. అతఁ డెట్లుండె ననఁగా:—అతఁడు ఒకనరశవమును గోఁచి పెట్టుకొనఁగా అది పొడుగు చాలనందున మొలత్రాటికి

దిగించి తగిలించుటలో దాని నెత్తురు బొడ్డుమీఁదికి బావిగోడవంటి మొలత్రాటిమోఁదు మీఁదికి చిలికియుండెను.—స్వభావోక్తి.

ఆతఁడు తన నల్లని శరీరమును ఎఱ్ఱని దుప్పటి కప్పుకొని బాపనచీమలు దట్టముగా పైఁబర్విన వక్రభల్లాతకివలె నుండెను.—ఉపమాలంకారము.

వాని మొగము తలక్రిందు చేసిన యేనుఁగుతలవలె నుండెను; ఎట్లన - పెదవిక్రిందినుండి కంఠము వఱకు లోఁవపడి రెండుపిండములుగా నున్నగడ్డము ఏనుఁగుయొక్క తలక్రిందైన కుంభములవలెను, నోటినుండి పలువులకడ క్రిందికి వంగిన నిడుదకోఱలు రెండును తలక్రిందైన యేనుఁగు తలలోని రెండు కోఱలవలెను ఉండెను.—ఉపమాలంకారము.

వ్రేలుగడ్డంబును మీసములును అంతయు ఒకటిగా నిలువుగా పెరిఁగి కఱుఁదురుల నిడుద తుట్టెవలె గోరోజనపు వర్ణముగా నుండెను, అందులో నోఁగిచే మఱుఁగుపడినభాగము కొంత పాటలవర్ణముగాను ఉండెను.—ఉపమాలంకారము.

తనకు ఆహారముకై ఆతఁడు ఎవఁడైన తెరువరి దారి తప్పి తన చెట్టుకడకు వచ్చుచున్నాఁడో కనుంగొనుటకై పైకొమ్ముల కెక్కి చూచుత్వరలో ప్రేవుజందెము బుజములనుండి జాఱి పోఁగా, దానిని కోపముతో మరల బుజమున కెక్కించుచుండెను;—స్వభావోక్త్యలంకారము.

అతనికి వ్రేలుబొజ్జ, బూరగాలు, చెంబుతలయు నుండెను. పెడతలయందలి గుంటలో (ముచ్చిలిగుంటలో) కొంచెము జుట్టు మొలచి యుండెను. కన్నులలో కండలు పెరిఁగియుండినవి. ఆతఁడు ఆఁకటఁ బెల్లున పిశాచికలను మాటిమాటికి కాఱుఁడిట్లు తిట్టుచుండెను. కొండంతబరువు వాఁడు, పేరు కుంభజానుఁడు; పేరకె తగినట్లే మోఁకాళ్లు కుండలవలె నుండెను.—స్వభావోక్తి.

“పాటలాఖ్యలు చెలంగుఁ। బల్ల యనఁ బొన్నె యనఁగను బయ్య్య యనఁగ” ఆం. భా. “కటి కట్ల్ కాటియ కటియు నల్లన। కప్పు కం దనఁగను నొప్పుఁ గృష్ణవర్ణంబు” ఆం. భా. ‘దంష్ట్రికలు’- “దంష్ట్రాకోటివిశఙ్కటాస్యకుహరః” వాసవ. “కూర్చ ప్రమశ్రుత్రియాం కశే। శ్మశ్రుకేతవపి తేషు భ్రువో ... పికత నే”-నానా.—‘వక్ర’-వక్రత - బొజ్జసాటికొఱకు. ‘పాయుగు గడ్డముకు’-పా. పాయలగడ్డముకు. ‘పాండురత’-“హరిణః పాణ్డురః పాణ్డుః” అమ. “త్రిణి పీతసంవళితశుక్లస్య” అని అంయులటీక - రామాశ్రమీయము. ‘జందెము’ - రూ. జన్నిదము - ప్ర. యజ్ఞోపవీతమ్. “అవటు ర్ఘాటా కృకాటికా”-అమ. “బూరకాల వాఁడనఁగ బృహద్పాదుఁడు దనరారు.” ఆం.భా.

ఉ. వాఁడును గంటిఁ బోకు మని వ్రాలె మహిన్ విటపాళి నుగ్గుగాన్,
వీఁడును మున్ను రేపగటి వేళకు మానిసి బోటఁ, బోరిలో
వాఁడిమిఁ గొంతకాల మిల వ్రాలుట, లావరి బోట, నిప్పు యా
వాఁడిశరంబుచే నడువ, వాఁ డని ద్రుంపుచు వీఁడు నుద్ధతిన్. 21

వాఁడును=ఆబ్రహ్మరాక్షసియు, కంటిన్ = నిన్ను చూచితిని, పోకుము అని, విటపఆళి = కొమ్మలసమూహము, నుగ్గుగాన్ = చూర్ణమగునట్లుగా (నలిగిపోఁగాననుట), మహిన్ = నేలకు వ్రాలెన్ = దుమికెను: వీఁడును=దాసరియు, మున్ను, రేపగటి వేళకన్ = రేయుంబగళ్లకు, మానిసి బోటన్ = శూరుఁడగుటచేతను, పోరిలోన్ = యుద్ధములో, వాఁడిమిన్ = మగఁటిమితో కొంత కాలము, ఇలన్ = భూమిలో, వ్రాలుటన్ = ప్రసిద్ధిపొందినవాఁడయినందున, లావరి = బల్లిదుఁడు, బోటన్ = అయినందునను, నిప్పు=పోకకాలాఁడి, ఆవాఁడిశరంబుచేన్ - మున్ను చెప్పినపదనుగల

జోడమ్ముతో (చేయమ్ముతో), అడుకఁ = రక్కసునిం గొట్టఁగా, వాఁడు = ఆరక్కసుఁడు, అది = ఆజోడమ్మును, త్రుంపుడుఁ = ఖండింపఁగా, వీఁడుఁ = దాసరియు, ఉద్ధతిఁ = గర్వముతో.- తర్వాతికన్వయము.

"విటపోఽస్త్రీ ద్రుమ విస్తారే పల్లవే స్తమ్బశాఖయోః"-నా. నా. మానిసి-"మానిసి మనిసి నా మనుజసామాన్యంబు" ఆం. భా.-ప్ర. మానుషః - లక్షణచే పరాక్రమశాలి. వాఁడిశరంబు - కర్త ధారయము - స్త్రీసమపూర్వపదము; "కర్త ధారయంబు త్రిక స్త్రీసమ ముగంత ధాతుజవిశేషణ పూర్వపదంబయి యుండు"-బాల. సమ. ౪.

సీ. తిగిచిన నడుగులు దెమలక యుఱమ్మప్ప
ళించి యవ్వలికిఁ జండించి దాఁటి
చఱచిన వంచించి చరమభాగమునకై
తిరిగి, తత్క్రియ కగు దృష్టి నిలిపి
పైఁబడ్డఁ జనుమఱపట్లు గొడ్డుచునుండు
పిడికిళ్ల బలిమి లోఁబడక నిలిచి
చొరఁజూడ గ్రుంగి ముష్టులబిగి కోటగాఁ
జొరనీక తిరిగెడు చోన తిరిగి

తే. యసుర వధసాధనము రోయు నపుడు గ్రుద్ది
తాచి తిరిగినఁ గృతముష్టి వండ నిలిచి
యొడకొలఁది వెన్క నడ నొయ్య నడిచి యడిచి
మత్పదస్మృతి యాత్మ నేమఱక యతఁడు. 22

(1) తిగిచినఁ = రక్కసుఁడు తన్ను లాగఁగా, అడుగులు = తనపాదములను, దెమలక = ఉన్నచోటినుండి కదలనీక, ఉఱమ్ము = రక్కసునివక్షమును, అప్పళించి = ఆస్ఫాలనముచేసి (చఱచి), అవ్వలికిఁ = అవతలికి, చండించి = తొలఁగి (పా. కేడించి) దాఁటి = లంఘించి (కర్త దాసరి); (2) చఱచినఁ = రక్కసుఁడు తన్నుఁ గొట్టఁగా, వంచించి = ఆ దెబ్బను ఉపాయవిశేషముచేతను తప్పించుకొని, చరమభాగమునకై = వాని వెన్నువైపు, తిరిగి, తత్క్రియకుఁ = వాని చేఁతకు, అగుదృష్టిఁ = తగిననచూపును, నిలిపి = వానివైపు ఉంచి (కర్త దాసరి); (3) పైఁ = తనమీఁద, పడ్డఁ = రక్కసుఁడు పడఁగా, చనుమఱపట్లకుఁ = వాని చనునలుపు లుండెడు తావులకు, ఒడ్డుచునుండు పిడికిళ్లబలిమిఁ = గుద్దె పెట్టుచున్నట్టి తనముష్టుల బలముచేత, లోఁబడక = రక్కసునికి లోఁగక, నిలిచి (కర్త దాసరి); (4) చొరఁజూడఁ = రక్కసుఁడు తన ఉఱమ్ముమీఁదికి చొచ్చుటకు ఉంకింపఁగా, క్రుంగి = తాను క్రిందికి తగ్గి, ముష్టులబిగి = తనపిడికిళ్ల బిగువు, కోటగాఁ = తనకు ప్రాకారముగా (పరిమాణాలంకారము), చొరనీక = వానిని తనఉఱమ్ముమీఁదికి రానీక, (పా. చొరవీక = చొరవ ఇయ్యక,) తిరిగెడు చోన = వాఁడు ఎటు తిరిగిన నట్లెల్ల, తిరిగి (కర్త దాసరి);

అసుర = రక్కసుఁడు, వధసాధనము = చంపుటకు ఏదేనొక పోటుముట్టు (రాయి గాని రప్ప గాని), రోయునప్పుడు = వెదకు సమయమందు, గ్రుద్ది = వానిని పిడికిటితో కొట్టి, తాచి = తన్ని,

నట్లుగా, (అతిశయించునట్లుగా), పొంగెడు భవత్ ముండంబున్ = గర్వమెక్కియున్న నీ తల కాయను, అసిన్ = కత్తితో, త్రెంచి = నఱకి, ధారా ఉష్ణము = వేఁడి యాఱని (నీ మొండెంపు) నెత్తుటిని, ఇంపు అరన్ = ప్రీతి యొప్పునట్లుగా, క్రోలి = త్రాగినవాఁడనై, పిశాచి = నా భార్య యయిన దయ్యపుసాని, నీదు కఱకుట్లు = కఱ్ఱకుఁగాని (కఱ్ఱునకుఁగాని) గ్రుచ్చి నిప్పులమీఁద త్రిప్పుచు పచనము చేయు నీ మాంసములు, అంది ఈన్ = నాకు అందింపఁగా, అద...మున్ - అదః = ఈ - తాల కాంతార = తాటిచెట్ల తోఁపుయొక్క - అంతః = లోపలి - నృకపాల = మానిసిపుఱ్ఱెల నెడి - కుండ = లొట్టులయందు - విగళత్ = ఓడుచున్న - మైరేయమున్ = కల్లును, త్రాగెదన్ = పానము చేసెదను.

తా.—పొగరెక్కిన్న నీతలకాయను కత్తితో మెడనుండి నఱకివైచి నీబొండుగనుండి దుమి కెడు నీమొండెంపు రక్తమును వేఁడియాఱకయే, దప్పితీఱ పంచప్రాణములును దనియునట్లుగా, బలేరుచితో త్రాగెదను. అంతట నీమాంసములను కఱుకుట్లుగా వండి నాభార్యపిశాచి నాకు తెచ్చి యిచ్చును, అంతట వానిని నంజుకొనుచు ఇదె యీ తాటితోఁపులో గుత్తలుగా కట్టియున్న మానిసి పునుకలలోనికి ఓడుచున్న తాటికల్లును త్రాగెదను. నృకపాలకుండ-పరిణామాలంకారము.

'మైరేయము'-మా. పట్టిక.—'సారో బలే స్థిరాంశేచ న్యాయ్యే క్లీబే వరే త్రిషు' అను. 'ఆస్వాదనమ్'=ఆస్వాదః - "ఆస్వాదవద్భిః కబళై స్తృణానామ్"-రఘు 2 (5). "ఆస్వాదవద్భిః స్వాదయుక్తై రిత్యర్థః"-మల్లి. టీక. 'ప్రాణపంచకము.'—"ప్రాణోపాన స్సమాన శ్చోదానవ్యానౌ చ వాయవః, హృది ప్రాణో గుదేఽపాన స్సమానో నాభిసంస్థితః ఉదానః కణ్ఠదేశస్థో వ్యాన స్సర్వ శరీరగః" అను. "పఞ్చప్రాణమనోబుద్ధి దశేన్ద్రియ సమన్వితమ్। అపఞ్చీకృతభూతోత్థమ్ సూక్ష్మాంగం భోగసాధనమ్" ఆత్మబోధ. మీరింబోన్ - దీనికి అతిశయించు, వర్ధిల్లు, విజృంభించు, సఫల మగు, నశించు అనునర్థములు సప్రయోగములుగా శ. ర. మందు ఉన్నవి. "తనయబంధుకళత్ర మిత్రములమీఁద మీరిఁబోవంగఁ బ్రాఁకినమోహలతను" శృం. శాకుం. 4 ఆ. "దేవోత్తం సుఁడు భక్తవత్సలుఁడు చిత్తేజః స్వభావుండు గా। రీవామాంగుఁడు శంకరుండు దయమీరింబోవఁ గాంచేలునన్। జావన్వచ్చినపుర్వుఁబట్టి తగు నీసద్భక్తికిన్ మెచ్చితిన్। నీవే యర్థము నన్ను వేఁడె దవు దానిం జెప్పుమా నావుడున్." శ్రీకాళ. మా.

వీని నెల్లం బరికింపఁగా "సంతోషించు" అను నర్థము కనఁబడలేదు, "అతిశయించు" అను నర్థము పొసఁగుచున్నది. - కఱకుట్లు - "గనగన నిప్పులం జమురుచిప్పిలం గాల్చిన కమ్మకఱ కుట్లన్" - మను. ౪ (౬) - ఇంగలకు "...కాల్చిన = ఇనుపశలాకలకు గ్రుచ్చి ప్రేలఁబట్టి పక్వ ముగాఁ గాల్చిన - కమ్మ = సంబారు చేర్చుటచేఁ బరిమళించుచున్న - కఱకుట్లన్ = శూల్యములతో - కట్టుతోఁ గుట్టిన మాంసఖండంబులతో - ('కఱుకుట్లు' - 'కఱ్ఱుకుట్లు' - 'కఱకుట్లు' - 'కఱ్ఱకుట్లు' - అనియును వీనిని వాడుదురు.) అని జూలూరి యప్పయ్య పంతుల టీక. అందీన్ - ఇది శబ్దపల్లవము. సంధికి పీఠికం జూచునది. వాఙ్మయమందు ఈ శబ్దపల్లవము నూర్లకొలఁది దొరకియున్నది. శబ్దపల్ల వము కాని క్త్వార్థకారసంధికి పదునెనిమిది పర్వముల మహాభారతములో "ఎఱిఁగించిపుడే" అను నొకటే ప్రయోగము దొరకుట క్త్వార్థకారసంధి ప్రియుల ప్రభావంబునం గాదేని యాశ్చర్యము గాదా? ఈ పద్యము మాకలపడిన ముద్రణంబున "ఇతఁడు మదీయాగ్రపుత్రుఁ। హితుఁ డితనికి నెల్ల తెఱఁగు లెఱిఁగించి లగిన్। ధృతరాష్ట్రుకడకుఁ బనుపుఁడు చతురవచనరచన గలపి సంప్రీతి మెయిన్," అని యున్నది.

క. నన్నింతలయించిన ఖలు
నిన్నే ఋజువిధి వధింతు నే యని యార్పుల్
విన్నందఁగ బుస కొట్టుచు
నన్నీచుఁడు దగ వెలువడు నవ్యక్తోక్తిన్. 26

నన్నున్ - ఇంత - అలయించిన=శ్రమపెట్టిన - ఖలున్=దుష్టుని, నిన్నున్, ఏన్ = నేను. ఋజువిధిన్ = సరళప్రకారమున, వధింతునే = చంపుదునా, అని, ఆర్పుల్ = బొబ్బలు - విన్ను అందఁగన్ = ఆకాశమును రాయుచుండఁగా (మిక్కిలి బిగ్గరగా అఱచుచు అనుట), బుసకొట్టుచున్=నిట్టూర్పులు ఊర్చుచు, ఆ నీచుఁడు = నీచుఁడయిన యా బ్రహ్మరాక్షసుఁడు, దగ=దప్పి, వెలువడు నవ్యక్త ఉక్తిన్ = తెలియనగుచున్న యస్పష్ట భాషితముతో (తరువాతి పద్యముతో నన్వయము).

తా.—"నన్ను ఇంతబాధపెట్టితివి గాన నిన్ను తిన్నఁగా చంపక చిత్రవధ చేసెదను", అని యార్చుచు బుసకొట్టుచు ఆ పాపాత్ముఁడు, అలయుటచేతను, అఱచుటచేతను దగిదొట్టి అస్పష్ట వాక్యములచే.—(పైపద్యములో పంచి అనుపదముతో అన్వయము).

ఏఋజు (ఏన్నృజు) - "ఋలువర్ణంబులు రలతుల్యంబులగుం" గావునఁ బ్రుతలోఁప వికల్పము.

తే. అసియుఁ బాత్రియుఁ దేఁ బంచి యాంత్రవల్లిఁ
గోలగ గ్గరఁ ద్రోయ నక్కుజముతోడ
నొరగి రక్కసుతో దైన్య విరహితముగ
ధర్మ మెఱిఁగించుసూక్తి నాతండు పలికె. 27

అసియున్=కత్తిని, పాత్రియున్=భాజనమును, తేన్ పంచి= తెమ్మని పిశాచికలను అజ్ఞాపించి, ఆంత్రవల్లిన్ = తీఁగవంటి ప్రేవుతో, కోలగ గ్గరన్ త్రోయన్ = పసరమును కట్టిత్రోయు నట్లు కట్టి త్రోయఁగా, ఆతండు=ఆ దాసరి, ఆ కుజముతోడన్ = ఆ చెట్టుమీఁదికి, ఒరగి= సోలి, దైన్యవిరహితముగన్=దిగులు లేనియట్లుగా, ధర్మము = ధర్మువును, ఎఱిఁగించు సూక్తిన్ = తెలుపు నట్టి మంచిమాటను, పలికెన్ =(ఇట్లు) వచించెను.

తా.—రక్కసుఁడు దాసరిని ఖండించుటకు కత్తిని, వానిరక్తమును పట్టుటకు పాత్రమును, తెమ్మని పిశాచికలం బంపి, అతనిని ప్రేవుత్రాళ్ల కోలగ గ్గరతో పడఁద్రోయఁగా నాతఁడు ఆ చెట్టుమీఁది కొరగి రక్కసునితో దిగులులేక ఈ క్రింది ధర్మసూక్తమును చెప్పెను.

'ఖడ్గేతు నిస్త్రింశచన్ద్రహాసాసి రిష్టయః'-అమ. 'త్రిషుపాత్రీ పుటీపేటి వాటీకువలదాడిమాః'-అమ. "పాత్ర్యమత్రే త్రిషు క్లీబం స్రువాద్యే రాజమన్త్రిణి తీరద్వయాన్తరే యోగ్యే"-అని రామాశ్రమి ధృతము.—"ఎద్దులను కాళ్లుగట్టి క్రిందేయుటకొప్పఁ। గోలగ గ్గర యనఁగ" - ఆం. భా. "శ్రుతి, స్త్రీ వేద అమ్నాయ స్త్రయీధర్మస్తు తద్విధిః" - అమ. "సూక్తికి సుద్ది" - అప్పకవి.

చ. విను మొకమాట రాత్రిచర, వేగిర మేటికి ? నిన్ జయింతురే
యనిమిషులైన ? భాజనగ తాన్నమ నే నిఁక నెందుఁ బోయెదన్ ?
బెనఁగక ప్రాణరక్షణ ముపేక్ష యొనర్చుట పాప, మిందు నై
కనలకు నాకు మేనియెడఁ గాంక్షయు లే దిది వోవు లేఁ దుదన్. 28

రాత్రిచర=ఓయిరేద్రిమ్మరీ (రక్కసుఁడా యనుట) - అనిమిషులు = దేవతలు, భాజనగత అన్నమును = నేను నీకించుములోని యాహారమును,... పెనఁగక = పోరక,... ఉపేక్ష యొనర్చుట= ఉపేక్షించుట,... కనలకు=కోపగింపకుము,... ఇది= ఈదేహము,... ఉరుల్ _ తగును.

'రాత్రిఞ్చరో రాత్రిచరః కర్బురో నికషాత్మజః' అమ. "అనిమేష శ్చానిమిష శ్చైతే ద్వే-సురమత్స్యయోః" - నానా. 'సర్వ మావపనం భాణ్డం పాత్రా మత్రంచ భాజనమ్' -అమ. ఉరుల్ చూ. పట్టిక. ఇచ్ఛా కాఙ్క్షా స్పృహేహా తృ డ్వాఞ్ఛా లిప్సా మనోరథః' అమ.—

"హన్తు మభ్యాగతం శత్రుం య శ్శక్తో న నివారయేత్ । స ఆత్మఘ్న ఇతి ఖ్యాతో రౌరవం నరకం వ్రజేత్" 'అందుకై - దాని దీని కనులకు అందించెందులు పెక్కువిభక్తులందు ఆదేశములగును. ఉ. అందుకై - అందువలన ఇత్యాది.

ఆ. హీనజన్మ మణుట, నొవ్వఁడే నొకప్రాణి
సంతసిలుట, ముక్తి పొంత గనుట,
మేలెకాదె శిబియ మేల్బంతిగాఁడె న
శ్వరపుదేహ మమ్మి పరముఁగొనుట. 29

హీనజన్మము=నీచపుఁబుట్టుక, అణుట=నశించుటయు,... సంతసిలుట =(నేను వాని కాహారముగుటచేత) సంతోషపడుట, ముక్తిపొంత = మోక్షముయొక్క సామీప్యమును,... నశ్వరపు దేహము=నశించుస్వభావము కలదైన కాయమును, అమ్మి=వెలగానిచ్చి, పరముల్ =స్వర్గమును, కొనుట =గెలుచుటయందు, శిబి=శిబిచక్రవర్తి, మేలుబంతి=ఒనవడి సర్వశ్రేష్ఠుఁడు, కాఁడె=కాఁడా.

తా.—నాదేహమును నీకు ఆహారముగా నొసంగుటచేత నాకు కష్టుంగడు మేలుకలదు; ఎట్లన, ఈ పెంటాలజన్మము తొలఁగును, ఒకప్రాణి అన్నముతిని, సంతోషించును, నాకు మోక్షము కలుగును; అందులకు డేగకై పావురమునకు బదులుగా ఆహారార్థము తనదేహము కోసికోసి యిచ్చిన శిబిచక్రవర్తి ఉత్తమోదాహరణముగదా. అర్థాంతరన్యాసము పరివృత్త్యలంకృతియు అప్రస్తుత ప్రశంసయు.

శిబి మహాదాత యని పేర్వడసి యుండెను. ఆతనిఁ బరీక్షించుటకు ఇంద్రాగ్నులు డేగయు పావురమునై, డేగ పావురమును ఆహారార్థము తినుటకొనివచ్చినట్లు వచ్చిరి. పావురము శిబిని శరణుఁజొచ్చెను. శిబి పావురముపాటి మాంసమును తన దేహమునుండి కోసియిచ్చుటకు కడంగి, అందులకు డేగ నొడంబడెను. కపాటాలో ఎంతమాంసము కోసివైచినను పావురమే మొగ్గు సూపుచుండెను. తుదకు శిబి తానే కపాటాలోఁ బడెను. అంత ఇంద్రాగ్నులు నిజరూపములం దాల్చి శిబిని నుతించి ఆయనకు శాశ్వతకీర్తితోడి దివ్యపదము నొసంగిరి.—

చ. తెవులయినం, గ్రహం బయినఁ, దేలయినం, గరమైన, నాత్మపెం
పెవు లయిన, న్జలం బయినఁ, దెక్కలియైన, మృగాగ్నులైన, మే
లవు లయిన, న్వ్రణం బయినఁ, ద్రాఁచయిన, న్పిడుగైనఁ, దీర్చు పే
లవతను వూరకే చెడఁ గిలన్ గృశు నొక్కనిఁ బ్రోచు టొప్పదే. 30

తెవులు=రోగము, గ్రహంబు = దయ్యము, తేలు=వృశ్చికము, గరము=విషము, ఆత్మపెద్దపులు = గొప్పమనోవ్యాధి, తెక్కలి = బందిపోటు, మృగాగ్నులు - మృగ=వ్యాఘ్రాదిజంతువులు - అగ్నులు_అగ్ని=నిప్పు... మేలు తవులు=కడుదుష్టమయిన వ్యసనము, వ్రణంబు=పుండు, త్రాఁచు=పాము, పిడుగు=అశని, తీర్చు పేలవతనువు = చంపునట్టి సున్నుల శరీరము, చెడక=నశింపక, ఇలన్ = భూమిలో, కృశుల్ =కార్శ్యమొందిన వానిని (ఆఁకలి గొన్న వానిని), ప్రోచుట=రక్షించుట.

గ్రతువుల చరుపురోడాశాహుతులభుక్తులం బవిత్రులై యమర్త్యత మీాకంటె నతిదీర్ఘకాలంబు వారు జీవించెద. రప్పావనత చూచి కదా సదా చతుర్ముఖాంశజుం డగుసుధాంశుండు గరంగి సకల రసముల కవధి యగు సుధారసంబున నాప్యాయనం బొనరించుచున్నవాఁ. డేతదర్థంబు మా కుచ్చరింపరాదుఁ గాని వేదంబు ప్రథమకళ యనలుండు త్రావు నని చెప్పు. మఱియు నాయాకళ లాయావేల్పులకుం గ్రమంబునం జెప్పు, నింత విచారించి రుచించినట్లు నడువు; మనినఁ, గహకహ నవ్వి యద్దాసరికి సురద్రోహి యిట్లనియె. 31

మాధ్యస్థ్యంబకాన్ = మధ్యస్థునిమాటగా (నిష్పక్షపాతవాక్యముగా), వృక=తోడేలు, శరారువులయందున్ =ఘాతుకమృగములలో, తిర్యక్కవు=కడుపు భూమివైపుపెట్టుకొని చరించు జంతువవు, దేవయోనివి=దేవతాజన్మము కలవాఁడవు, స్థావరంబులు=ఉన్నచోటనే ఉండుప్రాణులు (చెట్లు లోనగునవి), పతంగ=పక్షి, కరణ కళేబర ఆది=ఇంద్రియములు దేహము లోనగు, ఏకాంత కుత్సా (ఆ) వహంబు=కేవల నిందా కరము, బీభత్స=రోఁతయైన, పేయ అపేయ వివేకంబులు= త్రాఁగఁదగినది త్రాఁగఁదగనిది అను భేదజ్ఞానములు, దురిత అవతంస=పాపములలో ఎక్కుడైనది, గీర్వాణులు = దేవతలు, జముచేతనే = యమునిచేతనే, చండాంశుసుతునివీటన్ = సూర్యపుత్త్రుని (యముని) పురమున, సౌరి ముఖ=సూర్యపుత్త్రుఁడు (యముఁడు) లోనగు, బర్హిర్ముఖులు=దేవతలు, తైజసంబు = తేజస్సంబంధి, ఆహృతులు = ఆహారములు, వ్యాహృతులన్ = భూర్భువస్సువరాది మంత్రములచేతను, చరు = అన్నము, పురోడాశ = హవిస్సు, చతుర్ముఖాంశజుండు = బ్రహ్మాంశమునంబుట్టినవాఁడు, సుధాంశుండు = చంద్రుఁడు, ఆప్యాయనంబు = తృప్తి, ప్రథమకళ = చంద్రునితొలికళను, వేదంబుచెప్పుచున్ అని యన్వయము, ఆయాకళ లాయావేలుపులకున్— 'ద్వితీయాం పిబతేరవిః' ఇత్యాది.

క. చంపకు చదువుల మేము ప। ఠింపని శాస్త్రములె? మాపఠింపని శ్రుతులే?
యింప వవి నమ్మవేఁ 'బ్రథ।మాం పిబతే వహ్ని' యనెడుమాటవుఁ గాదే. 32

చదువులన్ = శాస్త్రోక్తులచేత, చంపకు=బాధింపకుము; మేము పఠింపని - శాస్త్రములె=ధర్మములా, మాపఠింపనిశ్రుతులే=మేము చదువని వేదములా, అవి=ఆశాస్త్రములు, ఇంపవు=ప్రియములు గావు, నమ్మవేని, వహ్నిః ప్రథమాం పిబతే= (అగ్ని) మొదటిచంద్రకళను త్రాగును, అనెడు-మాట=వాక్యము, అవుఁగాదే=తప్పదుగదా.

తా.—నేనును శాస్త్రములు చదివినవాఁడనే, నేనును వేదములు చదివినవాఁడనే, అవన్నియు నాకు ప్రియముగా నుండలేదు. నీవు ఆ యమర్త్యుల గుణమును కొనియాడితివి. వారు బ్రహ్మాంశసంభూతులంటివే, ఆ చంద్రునికళలను అగ్నిమొదలుకొని గుంటిపెట్టి తినువారే గదా. వారికి యోగ్యత యెక్కడిది ?—వ్యాఘాతాలంకారము.

మాపఠింపని శ్రుతులే = మా = మేము; కర్తృప్రథమ తత్క్రియావాచక ధాతుజవిశేషణముతో షష్ఠీసమాస మగుటకు—"నీ చెప్పిన పద్ధతి ద్రో। ణాచార్యులు మొదలుగాఁగ నని కొల్లని వా। రై చన్నవారలం గొని। యే చక్కం బెట్టువాఁడ నేఁ బాండవులన్"-భార. ఇంచు—"ఇంచిన భక్తి నొక్కతరలేక్షుణ నైషధభూమిభర్త మన్నించువరూథినీ పతికి" - శృం. నై. 6 (117).—

"ప్రథమాం పిబతే వహ్నిః" - దేవీపురాణము. వహ్ని యనెడు - "విసర్గంబున కనుకరణంబున లోపంబగు" - బాల.

మ. నిలు మోహో మము వారి భ్రాత లనుచున్ నీవంటి, వార ల్సుధా
శను లపూతాశులు గా రటంటి. ప్రతిప త్సోమాంశము న్గ్రోలు మున్
జ్వలనుం డం, టిఁక నొండు నిన్నడిగెదన్? సర్వాశి గాఁడా యతం,
డిలఁ దన్న్యాయము చాలు, మాకు నఘ మే? వృద్ధానుచారం బిఁకన్. 33

నిలుము=నిలువుము (ఉండుము), ఓహో=ఆశ్చర్యము! మమున్, వారి భ్రాతలు=వారి భ్రాతలము, అనుచున్, నీవు, అంటి = అంటివి, వారల్=దేవతలు, సుధా ఆశులు = అమృతభోజనులు, అపూత+ఆశులు = అపవిత్రమయిన భోజనము కలవారు, కారు అటంటివి=కారని పల్కితివి, జ్వలనుండు=అగ్ని, ప్రతిపత్ సోమ అంశమున్ = పాడ్యమినాఁటి సోముని కళను, గ్రోలున్ అంటి, ఇఁకన్ - ఒండు=ఒకటి, నిన్నడిగెదన్, అతండు=ఆయగ్ని, సర్వ ఆశి=సర్వభక్షకుఁడు, కాఁడే = అయియుండలేదా, ఇలన్=భూమిలో, తత్ న్యాయము=అతని యాచారమే. మాకున్ = రక్కసులమయిన మాకు, చాలున్ = ప్రమాణము, ఇఁకన్=మఱి, వృద్ధ అనుచారంబు = పెద్దలయొక్క నడవడి ప్రకారము నడుచుకొనుట, అఘమే=పాపమా (కా దనుట.)

తా.— మేము వారి భ్రాతల మంటివి, వా రమృతాశనులుగాని మావలె శవాద్యపవిత్ర భోజనులు కారంటివి. చంద్రకళలను భక్షించుటలో మొదలివంతువాఁ డయినయగ్ని సర్వభక్షకుఁడు గదా, మేమును అతని యాచారమునే యవలంబించితిమి, కావున మాయందు దోషమేమియు లేదు.

నిలుము-రూ. నిలువుము-"పిలుచు మొదలగువానికి ముత్తు పరంబగునపుడు కడ వ్రాయి బహుళంబుగ లోపించు" - బాల. క్రియా. ౧౦౧. భ్రాతలు - పూర్వదేవాస్సురద్విషః" - అమ. రెండు తెగలవారును కశ్యప ప్రజాపతిసంతతి యగుటంబట్టి. సుధాశులు-"అమర్త్యా అమృతాన్ధసః"-అమ. అపూతాశులు (రాక్షసులు అపూతాశులు దేవతలు గారు.)

తే. హరికి సఖుఁడును రథమును నగు గరుడుఁడు
దొరకి నమృతంబు సురలకు మరల నిచ్చి?
యహులు కూడుగ వరమున నడిగికనఁడె?
యమృత మైనను జవుల జాత్యన్న సమమె? 34

హరికిన్ =నారాయణునికి, సఖుఁడును=చెలికాఁడును, రథమును=వాహనమును, అగు-గరుడుఁడు=గరుత్మంతుఁడు, దొరకిన అమృతంబు=ఇంద్రుని ఓర్చి, తాఁదెచ్చినసుధను, మరలన్=వెండి. సురలకున్ = దేవతలకు ఇచ్చి, (తనకు), కూడుగన్ = ఆహారముగా, అహులు = పాములను, వరమునన్=వరముగా, అడిగి, కనఁడె=పొందలేదా, అమృతమయినను, చవులన్=రుచులచేత, జాతి అన్న సమమే=ఆయాజాతికి స్వాభావికమయిన యాహారముతో సమానమా (కా దనుట.)

తా.— ఎవరికిని ఏయన్నమైనను జాత్యన్నముతో సమానము గాదు; అందులకు దొడ్డవాఁడైన తార్క్ష్యుఁడు ఉత్తమాన్నమయిన యమృతమును ఇచ్చివైచి బదులుగా పాములను ఆహారముగాఁ గోరుకోలేదా—అర్థాంతరన్యాసము.

గరుడుఁడు హరికి సఖుఁడైనందులకుం బ్రమాణము:—"వితానదాసవ్యజన మిత్రకేతురథాదినా వైనతేయేన పురతః సేవితః శ్రుతిరూపిణా"-ది. సూ. చ. 1 (65).

చ. నిదురయుఁ గూడుఁ బోఁ జదివి, నే నిటఁ గన్న దియేమి? యెవ్వఁ డీ
చదువుల యర్థవాదపు మృష ల్విని చెల్పఁడు, నీవు మాయెడం
జదువులమాట లాడి కనఁ జాల వొకానొక మెచ్చు, నొక్కఁ డీ
చదివిన కూర వింతచవి, చాలఁగఁ, దె మ్మను మెచ్చు దక్కఁగన్. 35

కన్నది ఏమి=అనుభవించినది ఏమియు లేదు, అర్థవాదపుమృషల్ = ఉదాహరణార్థ మయిన మిథ్యాకల్పనలను, ఎవ్వఁడు చెల్పఁడున్ = ఎవ్వఁడును మోసపోఁడు, (నేను) మోసపోనని హృదయము, చదువుల మాటలు = శాస్త్రములలోని వచనములను, కనన్=పొంద, మెచ్చు=శ్లాఘ, ఈ చదివినకూర=భోజ్యమయిన యీ చదివినదాసరి, వింతరుచి = అద్భుతమయిన రుచిగానుండును,... అను మెచ్చు ఒక్కఁడు తక్కఁగన్ =అనెడు రుచి శ్లాఘ తప్ప.-వ్యాఘాతాలంకారము. (?)

"కామాతురాణాం నభయం న లజ్జా। విద్యాతురాణాం నసుఖం న నిద్రా
క్షుధాతురాణాం నరుచి ర్న కాలః। అర్థాతురాణాం న గురు ర్న బంధుః"

మృషల్-ప్ర-మృషా-అవ్యయము-వృథా వలె తెలుఁగున రూపసిద్ధి.

వ. అని గీష్పతి మతం బవలంబించి నిజాలాపకోళనపరుం డైన సక్కసు కుత్సితోక్కులకుం గృష్ణస్మరణంబు సేసి, యిందులఁ బొందుపడు ప్రత్యుత్తరంబుల వీనిఁ గెలఁకిన, బుద్ధిక్షోభంబుగా నింతకంటె నేమి యబద్ధంబులు వినంబడునో, మిూఁదఁ గార్యంబు గల మాకు వీనిఁ గాదనం బని లే, దని యంతరంబుఁ గూడుకొని, యందొనువర్తనపరుండై, నీచసంస్కృతికి రోసి, తన్ముఖోల్లాసంబునకు ఛద్మచ్ఛలంబున సంతర్కితంబున సుగతు నిదుకొని నీవు సర్వజ్ఞుండ, వేను నయుండ, హీనకులుండ, నసభ్యస్తశాస్త్రుండ, నీకుత్తరం బీ శక్తుండ నే, మద్వచనస్ఖాలిత్యంబులు సహించి దయచేసి నన్నొక మాఱ్ ప్రార్థనంబు గావింపుము. 36

గీష్పతిమతము=చార్వాకమతము (నాస్తికమత మనుట). కెలకినన్ = జర్చించిన, అందంబు గూడుకొని = వానితో తానును జేరి, ఛలంబునన్ = వ్యాజముచేత, సుగతున్ = బుద్ధదేవుని, సర్వజ్ఞుఁడు=సర్వ మెఱింగినవాఁడును బుద్ధుఁడును.

శా. ప్రఖ్యాతుండవు దైత్యులందు మును, పా పైనొక్క నీకా యశో
భిఖ్య న్నేనును బేర్చ, మే యొసఁగుఁ దప్పింపన్, వ్రతం బొక్కఁడే
ముఖ్యంబై యొనరింతు, దాని సఫలంబు న్సేయఁగా లేవుగా?
'సఖ్యం సాప్తపదీన' మ న్మన మిథ స్సాంగత్య మూహించుచున్. 37

(నీవు), మునుపు=మొదలనే, దైత్యులందున్ =రక్కసులందు, ప్రఖ్యాతుండవు=ప్రసిద్ధుఁడవు, ఆపైన్=దానికి తోడుగా, నేనును, నీకా=నీకన్ననో, యశః అభిఖ్యన్ =కీర్తియొక్క శోభనుఁ బేర్చన్=కూర్చెదను, మే ఒసఁగున్ =దేహముయొక్క యీవిని, తప్పింపన్=మానను, ముఖ్యంబై = ప్రధానముగా, వ్రతంబు ఒక్కఁడే=ఒక వ్రతమునే, ఒనరింతున్ =ఆచరింతును, సఖ్యమ్ = చెలిమి, సాప్తపదీనమ్ = ఏడు అడుగులు కూడ నడచిన నిష్పటిల్లునది; అను - మన - మిథస్ సాంగత్యము=

...దరహాసితన్ = చిఱునవ్వుగల వాఁడగుటతో (చిరునవ్వునవ్వుచు), చెక్కిలి = దాసరి యొక్క చెంపపయి, ...దాసరి=ఓ దాసరీ, లెస్స=చక్కఁగా, పండించితివి ఓయి = వంచించితివి రా, వనిన్ =అడవిలో, తెరవాటులు = (తెరువరులను కొట్టి దోఁచుకొనుటయును), దారిదోపుళ్లను కొట్టికొట్టి=నిత్యముంగావించి, మే=దేహమును, పెంచి=బలిపించి, నిన్నున్ కదా, విరక్తిన్ =వైరాగ్యము చేత, దాసరివి=హరిదాసుఁడవు, అయినాఁడవు, ఈ-మమున్ =నన్ను, కొంచెము చేసి = బేలు పఱిచి (వంచించి), త్రాడుకొఱకికోన్ = (జంతు వేదేని తన్ను కట్టిన త్రాటిని కొఱికితప్పించుకొని చనిపోవునట్లు) తప్పించుకొని పోవుటకు, తలపోసెదు=కోరుచున్నావు, నిన్నున్ మెచ్చితిన్.

తా.—నిన్ను నమ్మరాదు, నీవు శక్తి కలంతకాలము దార్లు గొట్టినవాఁడవు. ఈ నాఁటికి ఇది సులభజీవన మని లేనివైరాగ్యము నటించుచు దాసరివేసము వేసినాఁడవు. మోసము చేయుటకు మంచి సొంపికగా మాటలు కల్పించితివి. నన్ను పరమజాగరూకుని తప్పించుకొని పోఁజూచుచున్నావు. నీకు నేను మోసపోను జుమా.

దరహాసము హేళనము చేత. చెక్కిలి గొట్టుట - లాలన చేసినట్టుగా నే తన శక్తిని చూపుటకును, నోగు మాయ మనుటయు;—పండించితివి-"వంచించె ననుటకు బండించె ననఁగను గిఱరించె ననఁగను నేగానుండు"-ఆం. భా. "మార్గచోరకసంజ్ఞ మనుఁ బోలపరియనఁ। దెరవాటుకాఁ డనఁ దేజరిల్లు"-ఆం. భా. "నిరంతరతాళీదళసంపుట ప్రకర కాంతారంబునం దర్థపుం। దెరవాటుల్ తెగి కొట్టి"-మను. తెరవాటు కొట్టి= తెరవాటుగా కొట్టి, "(తెరవు ఆటు)" శ. ర. తెరవు+వాటు (వైచుట=కొట్టుట) అనినేఁ దలంచెద. "వాటు దాఁకి మఱుక్క వ్రయ్యలై పడెనని। ముదిత కోక కొంగు మూసికొంచు"-పంచ. మెచ్చితిన్ నినున్=నీటక్కు నేఁ గనుగొంటి నని భా.

శా. ఏరాజ్యంబు నరుండు నోరి కడివో నీబోధ మాలించు ? నిం
కేరాజ్యంబు నరుండు బాసకయి మే నీఁ దాన యేతెంచుఁ ? దీ
పార న్నేఁ జననీమియు న్నగిడి నీవా రామియుం దెల్ల ; మే
లా రంతుల్, పలుపల్కు లంత్యకుల, యేలా చింత లేలా వగల్. 41

ఏ రాజ్యంబునరుండు=ఏ దేశపు మనుష్యుఁడు, నోరికడి=నోటిలోని కబళము, పోన్ =తప్పిపోవునట్లుగా, ఈ బోధము=ఇప్పటికి పోనిమ్మనెడి యీ యుపదేశమును, ఆలించున్ = వినును,... బాసకయి=తన ప్రతిజ్ఞను నిలుపుకొనుటకై, మేను ఈన్ = తనదేహమును ఇచ్చువాఁడై, ...తీఁపు ఆరన్ =నీకు సంతోషము కలుగునట్లుగా,...చననీమియున్ = పోనీయననియు, నీవా=నీవన్ననో, రామియున్ =రాననియు, తెల్లము=స్పష్టము. అంత్యకుల = కడపటిజాతివాఁడా (మాలవాఁడా), రంతుల్ =రచ్చలును, పలుపల్కులు=పెక్కుమాటలును, ఏలా=ఎందులకు, చింతలు=విచారములు, ఏలా...వగలు=దుఃఖములు, ఏలా.

తా.—ఎవ్వఁడును నోటిముందఱి కబళమును వదలుమన్న వినఁడు, ఎవఁడును తన ప్రతిజ్ఞ నెఱవేర్చుకొనుటకు దేహ మిచ్చువాఁడై మరలరాఁడు, నేను పోనీయ ననుటయు, నీవు పోవ ననుటయు నిశ్చయము. పెక్కుమాటలాడి రచ్చచేయుటచేత ప్రయోజనములేదు, నీవు ఎంత విచారించినం బ్రయోజనము లేదు, అట్లే ఎంతదుఃఖించినను ప్రయోజనము లేదు.

రంతు-"రట్టు రట్టడి రద్దిర ద్దుష్పత। రంతు గోహారు గోరనఁగ వెలయు। నాఘోషణ సమాఖ్య"-ఆం. భా.

